7. రశనాః కింకిణీఘనాః । యంత్రాంగదాని చాంప్రేణాం నిద్రాహాన్త్యై కిల శ్రియః ॥ చంద్రశాలాసంశ్రితానాం చంద్రాస్యానాం మింటపైః ।

8. యత్రాస్య చంద్రై గ్గగనే చంద్రజ్ఞానం నశంక్యతే ॥ యత్ర రథ్యాంగణ గతా ఘనసారస్య రాశయః । దృశ్యంతే చంద్రికా సంఘా యథా....

9. ణః ॥ ఇంద్రనీలై శ్చంద్రకాంతై స్తథా యత్ర నిరంతరైః । అంధకారా శ్చంద్రికా

శ్చ దర్శయంతి కదా గృహాః ॥ కాంతా ఈక్షంతి యత్కాంతాః కాంతానాం హృద

యం దృశా । కాంతా యాఘాతి యత్కాంతా కాంతానాం హృదయం దృశా ॥ కళిందకన్యాలహరీ సంఘరింఖాణహారిణః । కటాక్షా యత్ర నారీణాం దృ ష్టయంతి నరింజనాః (?) ॥ హేలారయేణ తరణా యత్రారాళ దృశా దృశః ।

బద్ధరేఖా దర్శయంతి రతినాథకరస్థితాః ॥ అధరా యత్ర నారీణాం నక లా నధరీకృతాః । ఆఖ్యాంతి నళినశ్రేణీః కటాక్షైశ్చ కటక్షతాః ॥ తజణయంతి యత్ర నార్యః (రీ ?) కరకంకణకింకణీః । ఆక్రీడ దీర్ఘికా హంసీ(ః ?)గతి తస్కరతాం గతాః । కణకారతి కిరణ సంకీర్ణా న్నహరి దంకణమ్ (?)॥ అంక

ణాయంతి సంగీతం కతశౌఘం యదంగణాః । కర్ణ కల్హార కణికా హేలాశశి

కరోహి నః ॥ యత్రాశినస్త్రాసయంతే కాంతాకటక ఝంకృతైః । కటాక్ష కాంతికళయా హాసచంద్రైః కళంకితైః ॥ న హాసయంతి నాదానాం రూస్తాయణనేక్షణాః (?) । కనీనికాకళంకిన్యా కాంతిచంద్రికయాస్త్రియః ॥ ఉల్లోళయంతి యత్రత్యా శ్చంద్రికాహారిణః ఖగాన్ । లలాటేనార్ధ చంద్రేణ కృత్స్నచంద్రై స్తదాననైః ॥ యదంగనాః కళాసక్తిం నజానంతి విజా జితాః (?) । నాసాలంకారకాంతి...నక్షత్ర....

# రంగనాథుని రగడ

(చూ. పుట 161)

ఇందు బ్రాకెట్టులలోని భాగములు శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి M. A., B. O. L. గారి "వీరశైవాంధ్రవాఙ్మయము" లో నొసఁగఁబడిన పాఠమాధారముగాఁ గూర్పఁబడినవి.

ఈ రగడభేదమునకు "ద్విరదగతి" యని పేరు. ఇందొక్కొక్క పాదమునకు నాలుగేసి యయిదుమాత్రల గణములుండును. ఆ గణములు నగ, నలల, భల, సల, త, ర లని యనంతుఁడు. (చూ. ఛందోదర్పణము ఆ: 3. ప. 56) యతి ఒకటి మూఁడు గణముల మొదటి యక్షరములకుఁ జెల్లును. (చూ. అప్పకవీయము ఆ. 4 ప. 298) ప్రాసనియమము కలదు.

ఈ రగడ లక్షణమును అనంతుఁడు నప్పకవియుఁ జెరియొకరీతిగాఁ జెప్పిరి. వానిని వివరించుట యిట ప్రస్తుతముకాదని విడువఁ బడియె.

—సంపాదకుఁడు

శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడ నగుచుబోవఁ బథమునఁ జక్షుల్
దీపించు దృష్టి తొలఁగిన
శ్రీపతి నడుగంగఁ జెప్పె శివుఁ గర్తనుగాన్,

శ్రీశైల వల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీపురాధీశు గౌరీశుఁ బొడగంటి
(సర్వలోకేశ్వరు సర్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబుఁ బొడగంటి
పరమాత్ము నీశానుఁ బరమేశుఁ బొడగంటి
పరమయోగీంద్ర హృత్పదనిలయుఁ బొడగంటి)
మహినొప్పు శ్రీశైల మహిమ నేఁ బొడగంటి
బహువేదశాస్త్రముల్ ప్రణుతిసేయుటఁ గంటి
భూలోక కైలాస పురమనగఁ గనుగొంటి
ఫాలాక్షుఁ డిచ్చోటు పాయకుండుటఁ గంటి

ధృతిఁ దూర్పు మొగసాలఁ ద్రిపురాంతకముఁ గంటి
పర్వతలింగంబు ప్రాణేశుఁడని కంటి
పర్వతేశ్వరు హృదయ పద్మనిలయునిఁ గంటి
భక్తు లప్రతిహత ప్రతిభమతులని కంటి
భక్తులకుఁ బ్రత్యర్థివరులు లేరని కంటి
భక్తు లాపదలచేఁ బట్టువడరని కంటి
శివభక్తి దూషకులు చిరపాపులని కంటి
శివభక్తి దూషకులు చెడిపోదురని కంటి
త్రిభువనము భక్తులకుఁ దృణకణంబని కంటి
సభలందు భక్తులకు జయవాదమని కంటి
గౌరీశునే సర్వకర్తగాఁ బొడగంటి
కారుణ్యమున శివుఁడు కనిపించెనని కంటి
బహుపాపములు నన్నుఁ బట్టి విడుచుటఁ గంటి
నయముగా నయనములు నాకీయఁ బొడగంటి
భయభక్తులను భర్గు పాదములు పొడగంటి
ఇది పుణ్యమని కంటి నిది గణ్యమని కంటి
నిది యోగమని కంటి నిది భోగమని కంటి
నిది ధర్మమని కంటి నిది మర్మమని కంటి
నిది నిత్యమని కంటి నిది సత్యమని కంటి
(కడఁగి సంసారంబు కడగంటినని కంటి
కడఁగి శ్రీగిరి చెన్న కారణ్యమది కంటి
ఘనుఁడు రంగన దూషకర గండఁడని కంటి
జనకల్పతరులలో జయశాలియని కంటి
తవిలి రంగనమంత్రి ధన్యకృతియని కంటి
భువిలోనఁ బ్రోలాంబ పుణ్యవతియని కంటిఁ)
నింక శ్రీగిరిఁ జేర నేఁ గందునని కంటి
శంకరుని కృపవడయు సమయ మిదియని కంటి
నింక నాయెత్తు కృతులిత్తునని పొడగంటి
నింకఁ గృతిసెప్ప నాకేమి భరమని కంటి
వడిఁ గృతుల్ నాయెత్తు వచ్చునని పొడగంటి
(మృడుఁ డింక నా కృతుల్ మెచ్చునని పొడగంటి)

6

తనర శ్రీరంగకవి దాతయని పొడగంటి

..............................

భువిలోపలఁ బ్రసిద్ధ పుణ్యుఁడని పొడగంటి
(శివభక్తి దీప్తి కాచంద్రార్కమని కంటి
శ్రీగిరీశునకు నర్పింతునని పొడగంటి
శ్రీగిరీశ్వరుని కృప చెన్నలరునని కంటి)

# పదసూచిక

